పుచ్చిపళ్లను

ఎదుర్కోడానికి ఒక

సూపర్ ఫైటర్

వుంటేనే సాధ్యం.

















ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్
ప్రసిద్ధ ఫోర్‌హాన్స్
రక్షణ అందిస్తుంది.




ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్ చిగుళ్లను బిగిస్తుంది. పుచ్చిపళ్లను ఎదుర్కొంటుంది.

కున్నాడు. అప్పుడు రాయుడు ఎరచూపిన ధనానికి పూజారి లొంగిపోయాడు.

ఇద్దరూ కలిసి మర్నాటి రాత్రి హారాన్ని అపహరించటానికి నిశ్చయించుకున్నారు. సరిగ్గా అదే రాత్రి, శ్యామలుడు చాలా సేపు స్నేహితులతో తిరిగి ఇంటికి వస్తూ, దాహం తీర్చుకోవటానికి ఆలయం దగ్గిర వున్న కోనేటి దగ్గిర ఆగాడు. ఆ సమయంలో, దూరంగా పూజారి, రాయుడూ వస్తూ వాడికి కనిపించారు. అంత అర్ధరాత్రివేళ పూజారి ఆలయానికి ఎందుకు వస్తున్నాడో, శ్యామలుడికి అర్థం కాలేదు.

పూజారిని గురించి ఏదో అనుమానం కలిగి, వాడు చప్పున ఆలయంలోకి వెళ్ళి గర్భగుడి పక్కన చీకట్లో నక్కాడు. కొద్ది సేపు తర్వాత పూజారి ఒక్కడూ అక్కడికి వచ్చి, గర్భగుడి తాళం తీసి లోపలికి వెళ్ళాడు.

కొద్దిసేపు ఆగి శ్యామలుడు కూడా గర్భగుడిలోకి వెళ్ళి, పూజారి వెనకగా నిలబడి, "ఏం చేస్తున్నావు, పూజారీ?" అన్నాడు.

ఊహించని ఈ సంఘటనకు పూజారి నివ్వెరపోయాడు. భయంతో వణుకుతున్న అతడి చేతుల్లోంచి హారం కిందపడింది.

శ్యామలుడు హారం తీస్తూ, "భయపడకు! హారం అమ్మెయ్యాలని చూస్తున్నావా? నీ వెంట వచ్చిన అతనెవరు?" అని అడిగాడు.

పూజారి నెమ్మదిగా తేరుకుని వివరాలు చెప్పాడు. శ్యామలుడు హారాన్ని పరీక్షగా





చూస్తూ, "ఎవరో పరదేశస్థుడికి దీన్ని అప్పచెప్పి, కొత్త ధనం పుచ్చుకునే బదులు—మనమే దీన్ని ఉపయోగించు కుంటే బాగుంటుంది గదా!" అన్నాడు.

అందుకు పూజారి సంతోషంగా ఒప్పు కున్నాడు. వెంటనే ఇద్దరూ హారం తీసుకుని, గర్భగుడికి జాగ్రత్తగా తాళం వేసి, నిశ్శబ్దంగా బయటికి వచ్చి, అక్కడ కాపలా కాస్తున్న వాడి తలపై బలంగా మోదారు. వాడు నోటిమాట కూడా లేకుండా అక్కడే కుప్పకూలిపోగానే, తాళపు చెవులు వాడి పక్కన పడవేసి, పూజారీ, శ్యామలుడూ ఊరి పొలిమేరకేసి వేగంగా బయలుదేరారు.

ఊరి పొలిమేర దాటగానే, ఇద్దరి మనసుల్లోనూ, ఆ హారాన్ని పూర్తిగా తమ సొంతం చేసుకోవాలనే ఆలోచన కలిగింది. మర్నాటి మధ్యాహ్నానికి వాళ్ళిద్దరూ ఒక అడవి చేరుకుని, తాము దారిలో పట్నం నుంచి అడిగి తెచ్చుకున్న భోజనాలు చేశారు. అయితే, ఒకరికి తెలియకుండా ఒకరు భోజనాల్లో విషం కలపడంవల్ల, ఇద్దరూ మరణించారు." అని కథ పూర్తి చేశాడు కృష్ణచంద్రుడు.

తరవాత ఆయన శిష్యులతో, "శ్యామ లుడూ, పూజారీ ఇద్దరూ మొదట్లో అంత ప్రమాదకారులైన వ్యక్తులు కారు. అయితే, వారిలో అణుమాత్రంగా ప్రారంభమైన పతనం, రెండు రోజుల్లో సర్వనాశనానికి దారి తీసింది!" అన్నాడు.

శిష్యులంతా మౌనంగా అక్కడ నుంచి లేచారు. దొంగతనం చేసిన విద్యార్థి కన్నీటితో కృష్ణచంద్రుడికి నమస్కరిస్తూ, "నా పతనం, నాకర్థమైంది, స్వామీ! ఇక ఎప్పుడూ యిటువంటి పనులు చెయ్యను," అన్నాడు.

శిష్యులంతా వెళ్ళిపోయాక, కృష్ణ చంద్రుడు వెనుదిరిగే సరికి, ఆయన భార్య కన్నీళ్ళు తుడుచుకుంటూ, "ఆ విద్యార్థి బాగుపడినట్టే! కాని, పాపం శ్యామలుడూ, పూజారీ దురదృష్టవం తులు," అన్నది.



లాభమేముంటుంది," అన్నాడు తిరుపతయ్య శాంతంగా.

ఆ మాటలకు తిరుపతమ్మ శాంతపడక పోగా మరింత రెచ్చిపోయి, "అది ఊరు కాదు; పల్లెటూరు. పల్లెటూరివాపటం చేతెప్పుడు. రేపొద్దునే బయలుదేరి, మా పుట్టింటికి వెళదాం. అక్కడ చేపలు ఊరివిని, దొరక్కపోవు," అన్నది.

భార్య మాటకు ఎదురు చెప్పలేని తిరుపతయ్య, మర్నాటి ఉదయానే ఆమెను వెంటబెట్టుకుని బయలుదేరాడు. వాళ్ళు ఊరునానుకుని ఉన్న చెరువు దగ్గరకు రాగానే, అక్కడ రెండు గాలాలతో చేపలు పడుతూ జాలరిజంగయ్య కనిపించాడు. ఆ సమయంలో అతడు ఒక చేపను గాలం నుంచి లాగి బుట్టలో వేస్తున్నాడు.

తిరుపతమ్మ అది చూసి కళ్ళింతచేసి, ముక్కున వేలేసుకుని, "రెండు చేతులా సంపాయించుకుంటే, బుదిగానూలు! ఒకచేతి గాలం; పెరచేతి గాలం. ఈ జంగయ్య చెరువుగట్టున కదుపులో చల్ల కదలకుండా కూర్చుని, చేపలను ఒడ్డుకు లాగుతూ, మనలాటివాళ్ళకు లేబడు ధరకు అమ్ముతున్నాడు. జానెడు కూడా లేని, ఆ చేప ఖరీదు ఎంత చెబుతాడో చూస్తాను," అంటూ బుట్టలో చెయ్యి పెట్టింది.

అయితే, ఆ బుట్టలో అప్పటికే చేపలతో పాటు కొన్ని ఎండ్రకాయలున్నవి. అందులో ఒకటి తిరుపతమ్మ వేలును గిట్టలతో పట్టుకుని గట్టిగా నొక్కింది.

తిరుపతమ్మ బాధకు తాళలేక, జంగయ్యను, "ఏమేమయ్య జాలరివాడివి! ఎండ్రకాయల్నీ, చేపల్నీ ఒకే బుట్టలో వేస్తావా?" అంటూ తిట్టప్రారంభించింది.

జాలరిజంగయ్య, ఆమెను కోపం తగ్గే వరకూ తిట్టుకోనిచ్చి, "అమ్మా, ఈ చేపలూ, ఎండ్రకాయలూ, ఈ చెరువు నీళ్ళలోనే దొరికినై. అవి నీళ్ళలో కలిసి వున్నట్టే, బుట్టలో కూడా కలిసివున్నై. మిగతా చేపల్లా నోరు మూసుకుని వుంటే,



'కందుకోట' అన్న మాట వింటూనే భటుల నాయకుడు ఉలిక్కిపడి, "అయ్యా, మీకా కందుకోట సంగతి ఎలా తెలుసు?" అని అడిగాడు.

"ఆ కందుకోట గురించి నాకూ, నా గురువుకూ మాత్రమే తెలుసు. కాని, నువ్వు ప్రశ్నించిన తీరు చూస్తూంటే, మీకూ దాన్ని గురించి కొద్దో గొప్పో తెలిసినట్టు కనబడుతున్నది. వింత! ఆశ్చర్యం!!" అంటూ చంద్రవర్మ విస్తుపోయాడు.

"అందులో ఆశ్చర్యం ఏం వున్నది! ఆ కందుకోటను గురించిన ఒకానొక రహస్యం తెలుసుకునేందుకే, మేము అడవిలో ఒక జిత్తులమారి ముసలివాడి కోసం గాలిస్తున్నాం," అన్నాడు భటుల నాయకుడు.

చంద్రవర్మ చప్పున తన కుడి అరచేతి కేసి ఓ క్షణకాలం కళ్ళార్పకుండా చూసి, "ఆఁ ఇప్పుడు అంతా తెలిసింది! ఆ ముసలివాడి దగ్గిర కందుకోటకు వెళ్ళే మార్గాన్ని సూచించే పటం వున్నదని మీ రాజా అనుమానిస్తున్నాడు. ఆ ముసలివాడి కొడుకు దేవసింహుడనే వాణ్ణి కారాగారంలో బంధించాడు. అవునా? మీ రాజెంత అమాయకుడు!" అన్నాడు.

భటుల నాయకుడు చంద్రవర్మ చేతి కేసి పరీక్షగా చూసి, "అయ్యా, మీరు సర్వజ్ఞుల్లా వున్నారు! మీ అరచేతిలో యీ వివరాలన్నీ కనపడటం ఆశ్చర్యంగా వున్నది." అన్నాడు.

"ఏమిటి ఆశ్చర్యం? మీకా, నాకా?" అంటూ చంద్రవర్మ భటుల నాయకుడి కేసి చూసి, "మీరు తక్షణం యిక్కణ్ణించి కదిలి, ఆ రాళ్ళగుట్ట వెనక వున్న పల్లంలో నా కోసం వేచివుండండి. నేను కొద్ది క్షణాల్లో అక్కడికి వస్తాను. తరవాత అందరం కలిసి మీ రాజా దగ్గిరకు పోదాం. తెలిసిందా?" అన్నాడు ఆజ్ఞ ఇస్తున్నట్టు.

చంద్రవర్మ దగ్గిర ఏదో అపూర్వ శక్తి వున్నదని భ్రమపడిన భటుల నాయకుడు,

"చిత్తం, చిత్తం!" అంటూ తన అనుచరులతో గుట్ట వెనక వున్న ప్రదేశానికి వెళ్ళిపోయాడు.

వాళ్ళు గుట్ట వెనక కనపడకుండా పోగానే చంద్రవర్మ బయలుదేరి అల్లంత దూరంలో వున్న చెట్లల్లోకి పోయాడు. "అయ్యా మార్గస్థుడను! దేవలుడికి ప్రమాదం లేదు. ఎక్కడున్నావు జాంబవంతా?" అంటూ కేక పెట్టాడు.

ఆ కేక వింటూనే ముసలివాడు చెట్లలోంచి బయటికి వచ్చి, చంద్రవర్మను సమీపిస్తూ, "జాంబవంతుడెవరు?" అని అడిగాడు.



"నువ్వే జాంబవంతుడివి! ముసలివాడా, అని కేక వెయ్యటం బాగుండదని అలా పిలిచాను. నేను శివసింహుడి దగ్గిరకు వెళుతున్నాను. నీ కొడుకు దేవలుణ్ణి చెర నుంచి విడిపించటమే గాక, నీకు కంచుకోటలో దొరికే ధనరాసుల్లో భాగం కూడా యిప్పిస్తాను. అక్కడికి వెళ్ళే మార్గాన్ని తెలిపే పటం ఎక్కడ?" అన్నాడు చంద్రవర్మ.

"నీ మాటలు నమ్మవచ్చునా?" అన్నాడు ముసలివాడు చంద్రవర్మ కేసి అనుమానంగా చూస్తూ.

"నమ్మక నువ్వు చేయగలిగిందేమిటి? నమ్మితే. నీకూ, నీ కొడుక్కూ క్షేమం కలుగుతుంది. పడమటి సముద్ర తీరంలో కంచుకోట వున్నదని తెలిసిన తరవాత అక్కడికి చేరటం ఒక సమస్యగాదు. సముద్రతీరం వెంట వెళితే ఎప్పటికో ఒకప్పుడు అక్కడికి చేరకపోను. పోతే, నీ దగ్గిర వున్న పటం చూసినందువల్ల, అక్కడికి వెళ్ళేందుకు దగ్గిర మార్గం గాని, సులభమార్గం గాని కనబడవచ్చునని ఆశపడుతున్నాను." అన్నాడు చంద్రవర్మ.

చంద్రవర్మ యిలా అనేసరికి ముసలివాడు కిక్కురుమనకుండా తన దుస్తుల్లో దాచివున్న ఒక పెద్ద తాళపత్రపు కవిలె బయటికి తీసి, దాన్ని ఏదో పవిత్రంలా గంభీరంగా విప్పుతూ చంద్రవర్మతో,



చంద్రవర్మ మాట ముగించకముందే అతనికి పెద్దగా గుర్రం సకిలించిన ధ్వని వినబడింది. అతను చెట్లలోంచి గుట్ట కేసి తొంగి చూశాడు. రాజభటుల నాయకుడు తన గుర్రాన్ని గుట్ట మీదుగా ఎక్కించి, గుడిసె కేసి వస్తున్నాడు. అది చూస్తూనే చంద్రవర్మ, ముసలివానితో, "నేను రాజ భటుల్ని వెంటపెట్టుకుని ఉగ్రపురం వెళ్ళి రాజును కలుసుకుంటాను. నువ్వు ప్రస్తుతానికి ఈ గుడిసెలో వుండవచ్చు. నేను త్వరలోనే నీ కోసం కబురు చేస్తాను. అప్పుడు నువ్వు నగరానికి వచ్చి, అక్కడే హాయిగా జీవించవచ్చు." అంటూ భటుల నాయకుడికి ఎదురువెళ్ళాడు.

చంద్రవర్మ తనను సమీపిస్తుండటం చూసి భటుల నాయకుడు గుర్రాన్ని దిగుతూ, "అయ్యా, తమరు ఎంతకూ రాకపోయేసరికి, నేనే బయలుదేరి వస్తున్నాను. ఈ గుర్రం తమకోసమే! మీరు నగరానికి వస్తున్నట్టు రాజుగారికి వార్త పంపాను," అన్నాడు.

"నేను కొన్ని శక్తులను ఆవాహన చేసేందుకు అడవిలోకి వెళ్ళాను. మీ రాజును గురించి వాటిలో ఏ ఒకటీ ఒక్క మంచి మాట చెప్పకపోవటం నాకు ఆశ్చర్యంగా వున్నది. మీ రాజు అంత దుష్టుడా?" అని అడిగాడు చంద్రవర్మ.

"అయ్యా, రాజు దుష్టుడో మంచివాడో అతని సేవకుల కెలా తెలుస్తుంది? ఆ సంగతి ప్రజలకూ, పొరుగు రాజులకూ తెలియాలి. మాకు కావలసిందల్లా భత్యాలు సరిగా ముట్టటం! అది ముట్టచెప్పినవాడు మంచి రాజు, ముట్టచెప్పనివాడు చెడ్డ రాజు!" అన్నాడు భటులనాయకుడు.

ఆ మాటలతో చంద్రవర్మకు తను శివసింహుడి దగ్గిర ఎంతో మెలకువతో మెలగవలసి వుంటుందని అర్థమై పోయింది. కంచుకోటను చేరాలంటే తనకు కొంత బలగం కావాలి. అది శివసింహుడి లాంటి రాజువద్దనే తనకు లభ్యమవుతుంది. ఒంటరిగా కంచుకోటను



# ఫలించేకలలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రివేళ నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, నిజంగా నువ్వు అసహాయశూరుడివన్న నమ్మకం కలుగుతున్నది. కాని, కొన్ని మహాకార్యాలు సాధించడానికి శూరత్వం కన్న వివేకం, వివక్షాజ్ఞానం అవసరం అవుతుంది. అది లేనప్పుడు సాధించినది గంగపాలు కాగలదు. అందుకు విశాఖుడి కథే మంచి సాక్ష్యం. నీకు శ్రమతెలియకుండా వుండేందుకు, అతడి కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పాటలీపుత్రంలో జయసింహ అనే ధనికవర్తకుడుండేవాడు. ఆయన అంట

## బేతాళ కథలు



విశాఖు డతనికి దూరపు బంధు వొకడు; బతికి చెడిన కారణంగా, మరో దారి లేక రోజులు గడుపుతున్నాడు.

విశాఖుడు చురుకైనవాడు, మంచి అందగాడు. కాలం కలిసి రాకపోవడం వల్ల, జయనందుడింట సేవకుడిలా బతక వలసి వచ్చిన తన దురదృష్టాన్ని నిందించుకుంటూ, అతడెప్పుడూ లోలోపల కుమిలిపోతూండేవాడు.

అతడి ధ్యాస ఎప్పుడూ, తాను జయ నందుడంతటి ధనవంతుడు ఎలా కాగలడా అన్న విషయం మీదే వుండేది. అందుచేత అతడు లేనిపోనివేవో గొప్పగా ఊహించు కుంటూ పగటికలలు కనేవాడు.

ఒకనాటి మధ్యాహ్నం వేళ విశాఖుడు ఇంట్లో తీరిగ్గా కూర్చుని కునికిపాట్లు పడు తున్నాడు. ఆ సమయంలో అతడికి కల వచ్చింది. అందులో అతడు, జయ నందుడి కన్న తాను గొప్ప ధనవంతుడై నట్టూ, ఆస్తిపాస్తులు పోగొట్టుకుని బికారి అయిన జయనందుడే తనకు సేవకుడై నట్టూ కలగని, ఆ మైకంలో, "ఒరే, జయ నందా! ఎక్కడ చచ్చావురా? ఇటురా." అంటూ పైకి గట్టిగా కేక వేశాడు.

విశాఖుడి దురదృష్టవశాత్తూ, ఆ సమయంలో జయనందుడు సమీపంలో వున్నాడు. ఆయన, అతడి మాటలు విని మండిపడి, నిద్రలేపి, నాలుగుతన్ని వీధి లోకి నెట్టాడు.

అది చూసి జయనందుడి బంధుజనం, దాసదాసీలూ విశాఖుణ్ణి గేలిచేస్తూ నవ్వ సాగారు. ఆ అవమానం భరించలేక అతడు పాటలీపుత్రాన్ని వదిలి, ఒక అరణ్యమార్గం పట్టి నడవసాగాడు.

విశాఖుడు అరణ్యంలో కొంత దూరం వెళ్ళాక, ఒకచోట తపోనిష్ఠలో వున్న ముని ఒకడు కనిపించాడు. అతడు మునికి సాష్టాంగపడి, అలాగే వుండిపోయాడు.

ముని కళ్ళు తెరిచి విశాఖుణ్ణి చూసి, "నాయనా, నా వలన కావలసిందేమైనా వున్నదా?" అని అడిగాడు.



విశాఖుడు, మునికి జరిగినదంతా చెప్పి, "మహాత్మా! నాకు ఆ జయనందుడు దొరికినట్టు అనేటట్టు వరం అనుగ్రహించండి." అని కోరాడు.

ముని ఒకసారి తన దివ్యదృష్టితో, జయనందుడి పూర్వాపరాలన్నీ చూసి తెలుసుకుని, విశాఖుడితో, "ఆ జయనందుడు శ్రమించి తన శక్తియుక్తులవల్ల, అంత ధనికుడయ్యాడు. నువ్వు ఏ శ్రమా లేకుండానే, అతడంతటి ధనికుడివి కావాలని కలలు కంటున్నావు. నిద్రా సమయంలో కలలు రావడం ఎంత సహజమో, కలలో కనిపించిన ప్రతిది నిజం కాకపోవడం కూడా అంత సహజం. ఈనాటి నుంచి నువ్వు స్వశక్తితో పైకి వచ్చేందుకు ప్రయత్నించు." అన్నాడు.

ముని చెప్పిన హితవు విని విశాఖుడు నిరాశపడిపోయి, "మహాత్మా! తమరు చెప్పినదాంట్లో కొత్తదనం ఏమీ లేదు; అందరూ చెప్పేదే. తమకేమైనా మహిమ ఉంటే, నేను కనే కలలు నిజమయ్యేటట్టు అనుగ్రహించండి." అన్నాడు.

ముని మందహాసం చేసి, "అది చాలా స్వల్పవిషయం. నీకు వచ్చిన కల నిజం కావాలనుకుంటూ, ఈ మంత్రం ఆరు సార్లు మనసులో జపించు. నువ్వు కలలో చూసినదంతా నిజమవుతుంది." అని విశాఖుడి చెవిలో ఏదో మంత్రాన్ని ఉపదేశించాడు.

విశాఖుడు సంతోషంతో వెళ్ళబోతూండగా ముని అతడితో, "నాయనా, ఒక సంగతి చెప్పమరిచాను. ఈ మంత్రం మూడుసార్లకన్న నీకు ఉపయోగపడదు. అందుచేత బుద్ధికుశలతతో దీన్ని ఉపయోగించుకుని, నీకూ నలుగురికీ ప్రయోజనం కలిగేట్టు చూసుకో." అన్నాడు.

విశాఖుడు పాటలీపుత్రం తిరిగి వచ్చేసరికి రాత్రి అయింది. అతడు ఒక సత్రం అరుగు మీద పడుకుని, ముని చెప్పిన మంత్రం గురించి ఆలోచించసాగాడు. కొద్దిసేపటిలో అతడికి నిద్రపట్టింది.

సందుకు మరణించాడు. అతని శిష్యుడు వేరె అయిన సలహాలిచ్చేవాళ్ళు లేకుండా పోయారు.

రాజా యిచ్చిన గడువు పూర్తికావస్తున్నది. ఏం చేయాలో తోచక కలత పడుతున్న విశాఖుడికి, ఒక రాత్రి నిద్రలో తాను ఆ దేశానికి రాజైనట్టూ, ప్రత్యర్థులైన వ్యాపారులను కఠినంగా శిక్షించినట్టూ కల వచ్చింది.

ఈ కల గురించి అతడు భార్యకు చెప్పాడు. ఆమె సంతోషపడిపోతూ, "అంత మంచి కల, ఈ సమయంలో రావటం మన అదృష్టం! మీరు దేశానికి రాజైతే, యిప్పుడు వచ్చిన కఠినసమస్యలన్నీ పరిష్కారమైపోగలవు. కల నిజం కావాలంటే వెంటనే మంత్రోచ్చారణ చేయండి!" అంటూ తొందరపెట్టింది.

కాని విశాఖుడు ఏదో దుఃఖగ్రస్తుడైనవాడిలా ముఖం పెట్టి, "నేను వెంటనే అరణ్యానికి వెళ్ళి, మునిదర్శనం చేసుకోవాలి," అంటూ అప్పటికప్పుడే బయలుదేరాడు.

విశాఖుడు మునిని దర్శించి, యీ మధ్య కాలంలో జరిగినదంతా చెప్పి, "మహాత్మా! దయచేసి నాకిచ్చిన అపూర్వమైన వరాన్ని ఉపసంహరించండి, మంత్రం నిరుపయోగమయ్యేట్టు చేయండి," అని కోరాడు.



ముని నిశ్చలంగా నవ్వి, "నీకింత త్వరలో జ్ఞానోదయమవుతుందని అనుకోలేదు. నువ్వు కోరినట్టే వరాన్ని ఉపసంహరించాను. వెళ్ళిరా!" అని విశాఖుణ్ణి దీవించాడు.

విశాఖుడు ఇంటికి తిరిగి వచ్చి, ఆస్తిపాస్తులన్నీ తెగనమ్మి రాజుకు పన్ను చెల్లించాడు. తరవాత భార్యతో దేశంలోని ఒక చిన్న పట్టణం చేరి, అక్కడ వ్యాపారం ప్రారంభించి, వచ్చే స్వల్ప లాభాలతోనే తృప్తిపడుతూ, ఏ సమస్యలూ లేకుండా సుఖంగా జీవించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, విశాఖుడు మంత్రం జపించితే, దేశానికి



శిలాదుడు తన ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. ఎంత కాలానికీ కొడుకు కలగక పోయేసరికి ఆయన యజ్ఞం చేయ తల పెట్టాడు.

యజ్ఞగుండం తవ్వుతూ ఉండగా అందులో ఒక అందమైన బాలుడు దొరి కాడు. శిలాదుడు ఆ కుమారుడికి నందుడు అని పేరు పెట్టి పెంచసాగాడు.

ఒకసారి మిత్రా వరుణులు అనే మునులు శిలాదుని ఆశ్రమానికి వచ్చి, నందుణ్ణి చూసి, ఆ కుర్రవాడు అల్పాయుష్కుడని చెప్పి, శిలాదుడికి విచారం కలిగిం చారు.

"నువ్వు గండకీ నదివై పోతావు. నేను సాలగ్రామాల రూపంలో ఆ నదిలో శాశ్వ తంగా ఉంటాను. నీ పేర తులసిచెట్టు పూజింపబడుతుంది," అని చెప్పి, విష్ణువు ఆమెను గోలోకానికి తీసుకుపోయాడు.

పూర్వం సాలంకాయనుడు అనే మునికి శిలాదుడనే కొడుకు ఉండేవాడు. శిలా దుడికి సంతానం లేకపోగా, ఆయన కైలాసానికి వెళ్ళి, పార్వతీపరమేశ్వరులను గురించి ఘోర తపస్సు చేశాడు. పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై, శిలాదుని కోరిక విని విచారించి, "నీకు సంతాన ప్రాప్తి లేదు. అయినా ఒక కుమారుడు లభిస్తాడు," అని చెప్పారు.

నందుడు తండ్రి విచారానికి కారణం తెలుసుకుని, కేదారానికి వెళ్ళి, పార్వతీ పరమేశ్వరులను గురించి తపస్సు చేశాడు. చాలా కాలానికి పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై, నందుణ్ణి వరం కోరుకో మన్నారు.

"చిరాయువు కలిగి, నేను మీ సేవలు చేస్తూ, లోక ప్రసిద్ధుడుగా పూజింప బడేటట్టు అనుగ్రహించండి," అని నందుడు వేడుకున్నాడు.

పార్వతీ పరమేశ్వరులు అతనికి కోరిన వరం ఇస్తూ, అతనికి నందీశ్వరుడు అన్న పేరు పెట్టి, గణాధిపత్యం ఇచ్చారు. శివుడు నందుణ్ణి అభిషేకించడానికి తన



పాతకం నుంచి విముక్తి కలుగుతుంది,'' అని కాలభైరవుడితో చెప్పాడు.

అలాగే కాలభైరవుడు తీర్థయాత్రలు చాలాకాలం చేసి, కాశీక్షేత్రానికి చేరి, గంగాస్నానం చేసి, పవిత్రుడై, కాశీలోనే ఉండి, కాశీనగరానికి క్షేత్రపాలకుడై, పూజింపబడుతూ వచ్చాడు.

పూర్వం వ్యాఘ్రపాదుడు అనే ముని ఉండేవాడు. ఆయన భార్య విమల. వారిద్దరూ శివభక్తులు. వారు శివుణ్ణి ఆరాధించగా, ఈశ్వరానుగ్రహం వల్ల ఒక కుమారుడు కలిగాడు. ఆ పిల్లవాడికి వారు ఉపమన్యువు అని పేరు పెట్టుకున్నారు.

విమల పుట్టింటివారు విమలనూ, ఉపమన్యువునూ తమ ఇంటికి తీసుకుపోయి కొంతకాలం ఉంచుకుని, తరవాత వ్యాఘ్రపాదుడి వద్దకు పంపేశారు.

అయిదేళ్ళ వయసువాడైన ఉపమన్యువు ఒకనాడు తల్లితో, ''అమ్మా, నాకు పాలు కావాలి,'' అన్నాడు.

''మనం దరిద్రులం, నాయనా. నీ మేనమామలు ధనవంతులు గనక వాళ్ళు నీకు పాలూ, పెరుగూ పెట్టారు. మనకు లేవు,'' అని విమల కొడుకుతో అన్నది.

ఆమె నత్తుపిండి నీటిలో కలిపి ఇస్తే ఉపమన్యువు తాగక, గుక్కపెట్టి ఏడవ నారంభించాడు.

''మనం దరిద్రులమని చెప్పినా వినిపించుకోక ఏడుస్తున్నావు. నేను ఏం చేసేదిరా?'' అన్నది తల్లి.

''మన దారిద్ర్యం తీరే మార్గం ఏమిటి?'' అని ఉపమన్యువు తల్లిని అడిగాడు.

విమల తన కొడుకును వ్యాఘ్రపాదుడి వద్దకు తీసుకుపోయి జరిగినదంతా చెప్పింది.

వ్యాఘ్రపాదుడు ఉపమన్యువుకు శివ పంచాక్షరీ మంత్రం చెప్పి, ''బాబూ, నువ్వు కైలాసపర్వతానికి వెళ్ళి ఈ మంత్రం జపించావంటే పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై నీకు కోరిన వరం ఇస్తారు,'' అని చెప్పాడు.



# దగాపడిన దొంగ

ఒకసారి నలుగురు గ్రామస్థులు, పని మీద బాగ్దాదు నగరం వెళ్ళి, ఒక సత్రంలో బసచేశారు. వాళ్ళు ఏవో వస్తువులు కొనేం దుకు బజారుకు పోయారు. అది అదు నుగా తీసుకుని, ఒక దొంగ, వాళ్ళు ఊరికి అరవేసుకున్న పాత దుప్పట్లను అపహరించి పారిపోయాడు.

వాడు వాటిని ఒక సంతలో అమ్మేం దుకు ప్రయత్నం చేశాడు. కాని, అవన్నీ పాతపడినందువల్ల, ఎవరూ కొనేందుకు ముందుకు రాలేదు. ఎవరో ఒక అమాయ కుడు తన వలలో పడకపోతాడన్న ధీమాతో, వాడు దొంగిలించిన దుప్పట్లను పక్కన పెట్టుకుని కూర్చున్నాడు.

ఆ సమయంలో కోతి ఒకటి గెంతుతూ, పిల్లిమొగ్గలు వేస్తూ, వాడి దగ్గిరకు వచ్చింది. దొంగ దాని ఆట చూసి వినో దిస్తూండగా, దాని యజమాని ఒడుపుగా వాడి పక్కన ఉన్న పాత దుప్పట్లు తీసు కుని, చల్లగా అక్కడి నుంచి జారు కున్నాడు. వీడు కోతిని అడ్డాగా పెట్టు కుని దొంగతనాలు చేసే మరొక దొంగ!

మొదటి దొంగ కొంతసేపటికి, తన పక్కన వున్న దుప్పట్లు ఎవరో ఎత్తుకు పోయారని తెలుసుకుని కేకలు వెయ్యడం ప్రారంభించాడు. కాని, రెండవ దొంగ ఆ పాటికే అక్కడి నుంచి పారిపోయాడు.

మర్నాడు నగరంలోని మరొక ప్రాంతపు సంతలో మొదటి దొంగ, మంచి అట్ట పెట్టెలలో దిగించి కట్టిన దుప్పట్లను చూశాడు. దాని యజమాని పెద్దగా గొంతెత్తి, "అయ్యలారా, వస్త్రాలవ్యాపారం నాకేం అచ్చిరాలేదు. అందువల్ల, దుకాణం ఎత్తేసి, ఉన్న వస్త్రాలను కారు చౌకగా అమ్మేస్తున్నాను. కొనండి! కొనండి!" అని అరవసాగాడు.

మొదటి దొంగకు వాటి ఖరీదు నిజంగానే చాలా చౌక అన్న నమ్మకం కలిగింది. వాడు ఒక అట్టపెట్టెను చేతికి తీసుకుని, దానికి బిగించి వున్న తాడును విప్పబోయేంతలో, వ్యాపారి కేకేసి, "డబ్బిచ్చి కొన్న తరవాత వాటిని చూడాలి. కాలం కలిసిరాక, ఎంతో విలువైన వస్త్రాలను, బజారు ధరకంటె చౌకగా అమ్మేస్తున్నాను. కనుక్కోవడం లేదా?" అన్నాడు.

మొదటి దొంగకు, వ్యాపారి చెప్పిన మాటల్లో న్యాయం కనిపించింది. వస్త్రాలను మరెక్కడైనా లాభానికి అమ్మేయ వచ్చుననుకుని, వ్యాపారికి డబ్బిచ్చి వాటిని కొనేశాడు. వ్యాపారి ఆ మరుక్షణం అక్కడి నుంచి మాయమయాడు.

దొంగ ఒక అట్టపెట్టెకు కట్టి వున్న తాడును ఊడదీసి, లోపల వున్న వస్త్రాన్ని చూసి అదిరిపడ్డాడు. అది అంతకు ముందు రోజు వాడు సత్రంలో దొంగిలించినదే! తక్కిన పెట్టెలన్నీ తెరిచి చూడగా, వాటిల్లో నుంచి వాడు దొంగిలించిన అన్ని దుస్తులూ బయటపడినవి. వస్త్రాల వ్యాపారి నంటూ మోసం చేసినవాడు, పనికిమాలిన దుస్తులను మంచి అట్టపెట్టెలలో దాచి, తనను మోసగించాడు!

దొంగకు మతిపోయినట్టయింది. వాడు కళ్ళనీళ్ళు పెట్టుకుని, "సత్రంలో వీటిని దొంగిలించేటప్పుడు, ఎవరైనా పట్టుకుంటారేమో అని వణికిపోయాను. వీటిని మరొకడు దొంగిలించినప్పుడు ప్రాణం ఉసూరుమన్నది. అది చాలక వీటిని తిరిగి డబ్బిచ్చి కొన్నాను! ఛీ. దీనికంతకూ కారణం— ఆ గ్రామస్థులు పెట్టిన శాపనార్థం అయి వుంటుంది. ఇంకా వీటిని దగ్గిర వుంచుకుంటే, మరెన్ని బాధలకు గురికావలసి వస్తుందో!" అనుకున్నాడు.

వాడు ఆ వస్త్రాలన్నిటినీ ఒకే మూటగా కట్టి, బాగా చీకటిపడిన తరవాత, సత్రానికి వెళ్ళి, అరుగు మీద నిద్రిస్తున్న గ్రామస్థుల పక్కన వాటిని త్వరగా పెట్టి, తిరిగి చూడకుండా అక్కడి నుంచి పారిపోయాడు.



అన్నాను. అయితే, నాకు, యీ దేశపు రాజకుమార్తె చేత సేవలు చేయించు— అని అడిగింది. వెంటనే నిన్ను అపహరించి తెచ్చాను," అన్నాడు.

ఆ మాటలు వింటూనే మోహిని ఆశ్చర్యపోయి, పాపండుని కేసి పరీక్షగా చూసింది. అతడు ఆరడుగుల ఎత్తున్నాడు. మెలిమెలంగరు తిరిగివున్నాయి, కండలు తిరిగిన రూపం, అందమైన ముఖం. వాడి భార్య పాతకి, రూపంలో అతడికి పూర్తిగా భిన్నం. ఆమె పొట్టిగా, సన్నగా, నాపుగా, వికారంగా వున్నది. ఆమె కూతురు రోతకు అచ్చుగా తల్లి పోలికలే వచ్చాయి.



పాపండుడూ, మోహినీ మాట్లాడుకుంటూండగా, అక్కడ వున్న వృద్ధ సేవకు రాకను, "అందాలభరిణ గుహలో అడుగు పెట్టింది. నాయకుడు దీనిని తప్పక పెళ్ళి చేసుకుంటాడు," అన్నాడు.

అది విన్న పాపండుడు వెంటనే వాడి చెంప మీద గట్టిగా కొట్టి, "నేను ఏకపత్నీ వ్రతుణ్ణి! ఇలాంటి మాట యింకోసారి అన్నావంటే, నాలుకతెగ్గోస్తాను, జాగ్రత్త!" అన్నాడు.

ఇష్టమున్నా లేకున్నా మోహినికి, ఆ గుహలో నివసించక తప్పలేదు. ఆమె పాతకికి సేవలు చేయడానికి మొదట నిరాకరించింది. కాని, మిగతా సేవకులు అందుకు పాపండుడు ఎంత క్రూరమైన శిక్ష విధిస్తాడో చెప్పిన తరవాత, ఆమె బుద్ధిగా అన్ని పనులూ చేయసాగింది.

అక్కడ వున్నవారిలో నివసించే వృద్ధ సేవకుడికి, ఆమెపై జాలి కలిగింది. వాడు ఒకసారి ఆమెను ఓదారుస్తూ, "అమ్మా, ఎలా వున్నావు: నీకీ కష్టం రావలసింది కాదు. అయినా అక్కడి నుంచి బయట పడాలంటే, నీ కొక్కటే మార్గమున్నది. నీ అందచందాలతో, మా నాయకుణ్ణి ఆకర్షించు. అందుకు తగిన భార్యవు నువ్వే. నిన్నాతడు పెళ్ళి చేసుకున్నాడంటే, నీ కష్టాలన్నీ తొలగిపోతాయి," అని చెప్పాడు.

చాలామంది భటులు చుట్టూ ముట్టడంతో అది సాధ్యపడలేదు.

"అన్నాళ్ళకు నువ్వు వివాహానికి అంగీకరించావు: అదే చాలు!" అని రాజు అంతఃపురంలో రహస్యంగా మోహినికీ, హేమంతుడికీ బలవంతపు వివాహం జరిపించాడు.

వివాహ మయ్యాక మోహిని, హేమంతుడితో, "నన్ను క్షమించు! నువ్వు దొంగల నాయకుడివి. వివాహితుడివి. నన్ను నిర్లక్ష్యం చేసినవాడివి. అయినా నిన్ను బలవంతంగా వివాహం చేసుకున్నాను. నువ్వు, నా భర్తవు కావటం ఎంతో తృప్తిగా వున్నది. ఇష్టం లేకుంటే, యీ క్షణంలో నువ్వు వెళ్ళిపోవచ్చు. కాని, మళ్ళీ తిరిగి వస్తావని, నీ కోసం ఎదురు చూస్తుంటాను," అంటూ పాదాల మీద పడింది.

హేమంతుడు ఆమెను లేవదీసి, "నేను ఇక్కడి నుంచి వెళితే, నిన్ను వెంట తీసుకునే వెళతాను. నేను నిన్ను నిర్లక్ష్యం చేశానని భ్రమ కలిగించడానికే, నీ తండ్రి సహకారంతో, యీ నాటకమంతా ఆడాను. ఆ గుహలో వున్నవాళ్ళందరూ, నీ తండ్రి పంపినవాళ్ళే. నా పేరు కార్యసేనుడు; ప్రతాపవర్మ రాజకుమారుణ్ణి. నీలో సౌందర్యగర్వమున్నది. నిర్లక్ష్యము చేస్తే, నిన్ను నావల్ల ఆకర్షితురాలిని చేసుకోగలనని గ్రహించాను. అప్పుడు నిజం చెప్పాను కాబట్టి, నువ్వు నాతో మా రాజ్యానికి వచ్చేదీ లేనిదీ చెప్పు," అన్నాడు.

అది విని మోహిని దిగ్భ్రాంతురాలయింది. కొంతసేపటికి తేరుకుని, "ఒకరు లక్ష్యపెట్టినప్పుడే, నీ అందానికైనా విలువ. మనిషికి సరైన అందం—మంచితనం, వినయం అని, నీతో పాటు గుహలో వున్నప్పుడు తెలుసుకున్నాను. నీ భార్యగా నిన్ను సేవించుకుంటూ, నన్ను నేను తీర్చిదిద్దుకుంటాను," అన్నది.

ఆ తర్వాత ఆ దంపతులు ఇద్దరూ కలకాలం కలిసి సుఖంగా జీవించారు.






కొంకణతీరాన గల పర్వతాలలో ఒక కొండకు భూతాలకొండ అని పేరుండేది. చుట్టుపక్కల కొండలపైన ఆవులను మేపుకునే వారెవరూ తమ ఆవులను ఆ కొండపైకి పోనిచ్చేవారుకారు. ప్రమాదవశాన ఏ ఆవులు గాని ఆ కొండ మీదికి పోతే వాటిని తీసుకురావడానికి పశువుల కాపరులు ప్రయత్నించేవారు కూడా కారు. ఎందుచేతనంటే ఆవులపై గల ఆశకొద్దీ ఆ భూతాల కొండపైకి వెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చినవారెవరూ లేరు.

భూతాల కొండపైన ఆవుల మంద ఉండేది. ఉదయం కాగానే అవి కొట్టాలలో నుంచి బయటికి వచ్చి, కొండ అంతటా తిరిగి మేత మేసి, మళ్ళీ సూర్యాస్తమయం వేళకు, ఎవరో తమను తోలినట్టుగా, కొట్టాలకు తిరిగి వచ్చేవి. కాని వాటి వెంట ఎవరూ ఉండేవారు కారు. వాటికి ఎవరు పోషణ చేసేవారో, ఎవరు పాలు పితికేవారో, ఆ పాలు ఏమయేవో బయటిప్రపంచానికి తెలియదు. ఆ కొండ మీదనే పశువులకొట్టాలకు సమీపంలో ఒక పశువుల కాపరి గుడిసె కూడా ఉండేది. రోజూ సాయంకాలంపూట పాలు కాచినట్టుగా గుడిసె కప్పు నుంచి పొగ కూడా వస్తూండేది. అయినప్పటికీ భూతాల కొండపైన మానవుడెవరూ ఉన్న జాడ చూసినవారు ఆ ప్రాంతాల లేరు.

ఆ కొండపైన భూతాలున్నాయని, అవి అవకాశం దొరికినప్పుడల్లా చుట్టుపక్కల కొండలపైన ఉండే ఆవులను దొంగతనంగా ఎత్తుకుపోతాయని, వాటికోసం తమ కొండపైకి వచ్చినవాళ్ళను అవి చంపేస్తాయని చెప్పుకునేవారు.

ఆ భయంతోనే భూతాల కొండపైకి సాహసించి ఎవరూ వెళ్ళేవారుకారు.



అలా ఉండగా ఆ ప్రాంతాలకు సత్యపాలుడనే పశువుల కాపరి ఒకడు కొత్తగా వచ్చాడు. వాడు భూతాల కొండలో నిత్యమూ జరిగేదంతా చూశాడు. భూతాలను గురించి ఇతరులు చెప్పేదంతా విన్నాడు. సత్యపాలుడు యువకుడూ, సాహసికుడూ కావటంచేత వాడికి ఆ భూతాల కొండపైకి వెళ్ళి, అక్కడ వాస్తవంగా జరుగుతున్న దేమిటో తెలుసుకోవాలనే కోరిక పుట్టింది.

మిగిలిన పశుకాపరులు వాడితో అలాటి సాహసం చెయ్యవద్దన్నారు. కాని వాడు వినలేదు. ''కొండ మీదికి వెళితే వెళ్ళావు. ఆ గుడిసెలోకి మాత్రం వెళ్ళకు. అందులోకి వెళ్ళి తిరిగి బయటికి వచ్చినవారెవరూ లేరు. మొండితనం చేసి వెళ్ళావో నీ గతి అంతే అవుతుంది,'' అని మిత్రులు సత్యపాలుడికి హెచ్చరించారు.

అయితే సత్యపాలుడు మాత్రం భయపడలేదు. వాడు ధైర్యంగా భూతాల కొండ మీదికి వెళ్ళి అక్కడ ఉన్న గుడిసె చేరుకున్నాడు. అది మామూలు కొండలలాగే ఉన్నది. కాని ఎక్కడా భయంకరమైన దృశ్యాలు లేవు. అంతటా నిశ్శబ్దంగా ఉన్నది. వాడు గుడిసె దగ్గరకు వెళ్ళి లోపలికి తొంగి చూశాడు. మనుషులు నివసిస్తున్న గుడిసెలాగే ఉన్నది. ''ఎవరు లోపల ?'' అని సత్యపాలుడు రెండు మూడుసార్లు కేకపెట్టినా, లోపలి నుంచి జవాబు రాలేదు.

సంకోచించకుండా సత్యపాలుడు గుడిసెలో ప్రవేశించాడు. ఒక పక్కన నాలుగయిదు పాత్రలలో భోజనం వండి సిద్ధంగా ఉన్నది. ఇంకొక పక్కగా ఒక మంచం వేసి ఉన్నది. దానిపైన పక్క పరిచి ఉన్నది.

''అక్కడ ఎవరో మనుషులే ఉంటున్నారు. బయటికి వెళ్ళినట్టున్నారు. వారు తిరిగి వచ్చేదాకా విశ్రాంతి తీసుకుంటాను!'' అనుకుంటూ సత్యపాలుడు మంచం మీద నడుం వాల్చాడు.

"నేను మూత పెట్టలేదు. అందుచేత దాన్ని తీసే అవసరం నాకు లేదు," అన్నాడు సత్యపాలుడు.

భూతం మూత తీశాడు. గుండిగ నిండా బంగారు కాసులున్నాయి. భూతం వాటిని నేల మీద పోసి మూడు కుప్పలుగా చేసి, "అందులో ఏ కుప్ప ఏదో తెలుసుకో. సరిగా తెలుసుకున్నావా నువ్వు బాగుపడతావు. నాకూ శాపవిమోచనం అవుతుంది. ఏది కాని కుప్ప ఏరుకున్నావో, నిన్ను పిడికెడు బూడిద చేసేసి, నన్ను రక్షించడానికి ఇంకొకడు వచ్చేదాకా నే ఇలాగే జీవిస్తాను. నాకు శాపవిమోచనం అయిన తరవాత ఈ కుప్పలలో ఒకటి నీదీ, రెండవది పేద ప్రజలదీ, మూడవది నా చేత చచ్చిపోయిన వారి భార్యా బిడ్డలదీను. తెలిసిందా?" అన్నాడు.

సత్యపాలుడు తన చేతులతో మూడు బంగారు కాసుల కుప్పలనూ ముట్టి, "వీటిలో ఒకటి నాది!" అన్నాడు ఎంతో గంభీరంగా.

వెంటనే గుడిసెలో ఒక పెద్ద మెరుపు మెరిసినట్టయింది. భూతం మాయమై దాని స్థానంలో ఎవరో ఒక గంధర్వుడు లాటివాడు నిలబడి ఉండటం కనబడింది. అతను సత్యపాలుడితో, "నీ పుణ్యాన నాకు శాప విముక్తి కలిగింది. నేను పోతున్నాను. ఈ రోజు మొదలుకొని, ఈ కొండా, దీని మీది పశువులూ, ఈ బంగారమూ నీదే!" అని ఎటో మాయమై పోయాడు.

భూతాల కొండపై నుంచి సత్యపాలుడు సజీవంగా తిరిగి రావటం చూసి, మిగిలిన పశువులకాపర్లు చాలా ఆశ్చర్యపడ్డారు. వాడు వారితో కొండ మీద జరిగిన సంగతి అంతా చెప్పాడు.

సత్యపాలుడు అది మొదలు భూతాల కొండపై నివాసం ఏర్పరచుకుని, తన వంతు బంగారంతో చిరకాలం సుఖంగా జీవించాడు. క్రమంగా చుట్టుపక్కల ప్రజలు ఆ కొండను భూతాల కొండ అని పిలవటం మానేశారు.



# బలే మజా గోల్డ్ స్పాట్ మజా



